# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Monday, the 24th September, 1956.**

The House met in the Assembly Hall, Kurnool, at twelve noon Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

---

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS

*Retired and re-employed Gazetted Officers.*

223.

*62-Q: SRI S VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state the number of retired Gazetted Officers who are re-employed in the State?

THE HON. Dr. B. Gopala Reddi:—

There are forty two retired Gazetted Officers, who are now re-employed in the State.

SRI S. VEMAYYA :— Retire అయినటువంటి officers ను re-employ చేస్తున్నందువలన, క్రింద పనిచేస్తున్నటువంటి young people యొక్క promotion కు ప్రతిబంధకంగనుక ఈ విధానానికి స్వస్తిచెప్పి, క్రింది వాళ్ళకు promotion ఇచ్చే విధానాన్ని ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— గౌరవ సభ్యులు చెప్పినటువంటి ప్రతి విషయాన్ని కూడా గమనించి, కొన్నికొన్ని అనివార్య పరిస్థితులలో మాత్రమే ఇటువంటి వాళ్లను re-employ చేయడం తటస్థిస్తున్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Retire అయి చాలా సంవత్సరాలు, 10, 15 సంవత్సరాలు అయినటువంటివారిని కూడ re-employ చేస్తున్నారు. దానివలన క్రిందివాళ్లకు promotion లేకుండాపోతున్నది. కనుక ఈ విధానాన్ని విరమించుకొంటారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ప్రతి విషయము దాని individual merits ను గమనించే చేయబడుతుంది. ఆ ఉద్యోగానికి లాయక్కైనటువంటివారు క్రింది వాళ్లలో ఉన్నారా లేదా, ఇంకా అనేక విషయాలు కూడ పరిశీలిస్తున్నాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఏ ఏ Department లో ఎంతమందిని ఆ విధంగా తీసుకువచ్చారో చెప్పగలరా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— నా దగ్గర 42 పేర్లు ఉన్నాయి. అవన్నీ చదువమంటారా ? It is a long list ఎక్కువగా Survey Department లో ఉన్నాయి.

Mr. SPEAKER :— If it is a long list, you need not read them.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఇతర States కు చెందినవారిని retire అయిన వారిని ఎంతమందిని తీసుకువచ్చారు ?

THE HON. Dr. B. GOPALA REDDI :— త్రైతీరియా నుంచి ఒక retire అయిన వారిని తీసుకువచ్చాము, D. S. రెడ్డిగారిని.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఇతర states కు చెందినటువంటి వారిలో retire అయిన వారిని ఎవరెవరిని తీసుకువచ్చారు ?

THE HON. Dr. B. GOPALA REDDI :— వెంకటక్రిష్ణయ్యర్ అనే వారు composite Madras State లో retire అయిన వారు ఉన్నారు.

SRI P. NARASIMHAPPA RAO :—ఇప్పుడు ఇటువంటి వారిని ఇన్ని సంవత్సరముల వరకు తీసుకోవలెనని ప్రభుత్వము యొక్క పాలసీయా ? తరువాత, gazetted ఉద్యోగస్థులనే కాకుండా, క్రింది వాళ్లనుకూడ retire అయినటువంటి వారిని తీసుకోనవలెనని ఉద్దేశమున్నదా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ముఖ్యంగా కొన్నికొన్ని Departments లో, అనగా Public Health Department లో, Survey Department వగైరా Departments లో మనకు ఉన్నవారిలో తర్ఫీదు అయినటువంటి senior people లేకుండా ఉన్నారు. అటువంటప్పుడు ఈ విధంగా retire అయినట్టువంటి వారిని తీసుకోవలసి వస్తున్నది. ఉదాహరణకు Anti Malaria Officer అనుకోండి. ఇపుడు దక్షిణామూర్తి ఉన్నారు. అటువంటి వారు లేకనే, re-employment చేయవలసి వస్తున్నది.

AN HON. MEMBER :—ఇప్పుడు Gazetted Officers గా retire అయినటువంటి వారినే continue చేస్తామని అంటున్నారు. కాని ఆ యోగ్యతలు, ఆ అర్హతలు కలిగినటువంటి వారు క్రింది ఉద్యోగస్థులలో లేనందువలన ఆ విధంగా వారిని re-employ చేశారా ? లేక అటువంటి వారు ఉండికూడ చేశారా ?

24th September 1956]

THE HON. Dr. B. GOPALA REDDI :— క్రింది ఉద్యోగస్థులలో తగినంత అనుభవము ఉన్నవారు లేకుండాపోవచ్చును. రెండు సంవత్సరములు Exective Engineer గా ఉన్నవారిని, వెంటనే Superintending Engineer గా వేయడం సరికాదు. అవిధంగా, Suvey Department లోను, Public Health Department లోను సరియైనటువంటివారు లేకుండా ఉన్నారు. ఇవన్నీ గమనించ వలసియున్నది.

SRI B. SANKARAIAH :—Retire అయినవారిని మళ్ళీ re-employ చేయడానికి ఏమైనా rules ఉన్నాయా, లేక ఎప్పటికప్పుడు అనివార్య పరిస్థితులను బట్టి అటువంటివారికి re-employment ఇస్తున్నారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఒక సంవత్సరంకన్నా ఎక్కువ ఇవ్వకూడదని ఒక సంప్రదాయం పెట్టుకొన్నారు, అంటే not more than one year at a time అని, తరువాత extension అనేది ఇవ్వకుండా, re-employment మాత్రమే ఇవ్వాలని, ఈ విధంగా కొన్ని సంప్రదాయాలు పెట్టుకొన్నారు. Rules ఏమీలేవు.

SRI V. VISWESWARA RAO :—Re-employment చేసేవిషయంలో ఒక సంవత్సరంకంటె ఎక్కువగా చేయకుండా చర్య తీసుకొంటారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—అట్లే చేస్తున్నారు. కాని, కొన్నిచోట్ల కొందరు contract officers వేరే ఉంటారు. ఇప్పుడు D. S. రెడ్డిగారికి మూడు సంవత్సరాలు contract ఇచ్చినారు. వెంకటక్రిష్ణయ్యర్ గారికి మొదలు 2 సంవత్సరాలు ఇచ్చి, తరువాత ఒక సంవత్సరం ఇచ్చినారు. కాని మామూలుగా ఒక సంవత్సరం మాత్రమే re-employment ఇస్తున్నారు.

SRI V. VISWESWARA RAO :—ఒక సంవత్సరం తరువాత ఒక సంవత్సరం ఈ విధంగా ప్రతి సంవత్సరం re-employment చేయకుండా, అంటే ఒక సంవత్సరంకంటె ఎక్కువ చేయకుండా చర్య తీసుకొంటారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—మేము అనుకొన్న ప్రకారం ఒక సంవత్సరంలోపల ఆ post fill up కావడానికి లాయకైనవారు ఉంటే అట్లే చేస్తాము.

THE HON. SRI N. SANJEEVA REDDI :— This is a simple proposition, Sir, ఒక సంవత్సరం లోపల, ఆ post కు లాయకైనవారు లేకుండా ఉంటే, మరల వారికి re-employment ఇస్తారు. ఆ circumstances బట్టి చేస్తున్నాము. Assistant Engineers గా ఉన్నవారిని వెంటనే Executive Engineers

గాను, Executive Engineers గా ఉన్నవారిని వెంటనే Superintending Engineers గాను ఈ విధంగా వెంటవెంటనే ఆంధ్రులకు promotion చేయడం బాగానే ఉంటుంది, అది ఆంధ్రత్వం అనిపించుకోవచ్చు గాని, సరియైన అనుభవము గలవారు లేకపోతే, ప్రాజెక్టులకు ఎంత ప్రమాదమో ఆలోచించండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఒక సంవత్సరం తరువాత ఒక సంవత్సరం ఈ విధంగా re-employment ఇస్తే, వారికి ఒక definite idea ఉండదు కాబట్టి definite గా ఒక period fix చేస్తే బాగుంటుందేమో ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ఒకేమారు 3 సంవత్సరాలు, 5 సంవత్సరాలు ఆ విధంగా re-employment ఇస్తే గౌరవ సభ్యులకు సంతోషమేనా ? ఒకేమారు 3 సంవత్సరాలు, 5 సంవత్సరాలు ఇస్తే, ఈ మధ్య వారి ఆరోగ్య మెట్లుంటుందో చెప్పలేము. కనుక ఇటువంటి విషయాలన్నీ చూడవలసి యుంటుంది.

SRI S. VEMAYYA :— ఇప్పుడు ఈ retired and re-employed Gazetted Officers 42 మంది ఉన్నారని అన్నారు. వీరిలో ఆంధ్రేతరులు ఎంత మందో, ఆంధ్రులు ఎంతమందో తెలియజేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— వేరే ప్రశ్న వేస్తే చెప్తాను. అయినా ఆంధ్రులంటే ఎవరో define చేయాలి. ఇప్పుడు మద్రాసులో తెలుగు మాట్లాడేవారు ఆంధ్రులు అవునా కదా ?

SRI PILLALAMARRI VENKATESWARLU :— Information కోసం ఆ పేర్లు చెప్పితే బాగుంటుంది, గనుక వారి పేర్లు తెలియజేస్తారా !

Mr. SPEAKER :—I shall ask the Government to place them on the table of the House.

Mr. SPEAKER :—Questions 224 and 225 may be put together.

*Utilization of stone, sand, cement, etc., at the Nagarjunasagar Project.*

224.

* 66 Q: SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether this Government consulted any American expert regarding the utilization of stone, sand, cement, etc., at the Nagarjunasagar Project site ;

(b) if so, what the recommendations of the expert are;

(c) whether the Government propose to establish a laboratory to test sand, stone and cement, etc., at Nagarjunasagar Dam site now; and

(d) if so, the cost of establishing the laboratory?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) Mr. Slocum, an American Expert visited the Nagarjunasagar Project in March 1956.

(b) His main recommendations were: the immediate layout by competent persons of a general construction plan; ordering certain equipment immediately before the general plan is completed and adopted and the construction of the dam in concrete in preference to groutlaid-masonry to achieve economies.

(c) The Nagarjunasagar Dam site is under the control of the Nagarjunasagar Control Board and the question of setting up of a laboratory is one for consideration by the Control Board.

(d) Does not arise.

*Speedy execution of Nagarjunasagar Project.*

225.

*214 Q: SRI S. VEMAYYA:

SRI M. NAGI REDDI:

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government received the report of the Technical Expert, Sri Slocum regarding the speedy execution of the Nagarjunasagar Project; and

(b) if so, what are his recommendations in the matter?

THE HON. SRI N. SANJEEVA REDDI:

(a) & (b) Attention is invited to the answer given to parts (a) and (b) of Question No. 66.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఈ recommendations మీద ప్రభుత్వము ఏమైన నిర్ణయం తీసుకొన్నదా? తీసుకొన్నట్లయితే, ఏమి నిర్ణయం తీసుకొన్నది?

THE HON. SRI N. SANJEEVA REDDI:— బోర్డు తీసుకొన్నది. నేను బోర్డు సభ్యుణ్ణి గనుక, నాకు తెలిసిన information ఇస్తాను. బోర్డు వెంటనే ఒక Expert Committee ని appoint చేసింది. దక్షిణదేశము వారిని, ఉత్తరదేశం

వారిని, పెద్ద పెద్ద ఇంజనీర్లను కలిపి ఒక కమిటీ ఏర్పాటు చేసింది. వారు రెండు, మూడు మార్లు సమావేశమైనారు. ఈ మధ్యనే వారు ఒక రిపోర్టుకూడా submit చేసినారు. Masonry తోనే కట్టవచ్చునని అందరు కలిసి ఏకగ్రీవంగా ఒక రిపోర్టు ఇచ్చారు. ఆ రిపోర్టును బోర్డువారు అంగీకరించారు.

SRI V. VISWESWARA RAO :— ఈ Slocum అనే expert ను మన ప్రభుత్వము కోరిందో, లేక కేంద్ర ప్రభుత్వము పంపించిందా, లేక నాగార్జున సాగర్ బోర్డు కోరిందా ? రెండవది, ఈయన కాంక్రీటు ఉపయోగించాలని అంటున్నాడు. దాన్ని గురించి యంత్రాలన్నీ అమెరికానుంచి తీసుకురావాలనే సూచనలేమైనా ఈయన చేశాడా ?

Mr. SPEAKER :— The decision is that they can use stone. Then why all these questions ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— అవునండి, ఆ decision తీసుకొన్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఆ రిపోర్టులో technical side వదలిపెట్టి మిగతా భాగము, general గా ఉండేది సభ్యులకు అందజేయడానికి వీలుంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అది బోర్డువారు నిర్ణయించాలి. ప్రభుత్వమే independent గా చర్య తీసుకోవడం న్యాయం కాదు. రాష్ట్రప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వము, ఒక separate Board ఉన్నప్పుడు అది ఎంతవరకు సాధ్యమవుతుందో చెప్పలేను. బోర్డును సంప్రదించవలసి యుంటుంది.

*Estates in Krishna district*

226.
* 156 Q: SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government have taken over all the estates in Krishna district; and

(b) if not, how many have yet to be taken over ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

All the estates in Krishna district, other than the whole inam villages which became "estates" by virtue of the Madras Estates Land (Third Amendment) Act, 1936, i.e. those in respect of which the Kudi-waram vests in a person owning the melwaram thereof, have been taken over by the Government.

There are about 34 of such estates in Krishna District, which have not been taken over.

SRI V. VISWESWARA RAO :—ఇప్పుడు మంత్రిగారు 34 పేర్లు ఉన్నవని చెప్పారు. అవి ఏవో చదువుతారా ?

Mr. SPEAKER :—You put a separate question. They will be printed and supplied to you. It will take a lot of time to read 34 names.

THE HON. SRI K. CHANDRAMOULI :—Names list ప్రత్యేకంగా అడిగితే, యిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆ గ్రామాలలో ఉండే total acreage ఎంతో, ఆ information అంతా ప్రభుత్వంవద్ద ఉన్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—తెలియదండి.

Mr. SPEAKER :—If you want the names of those villages, please put a separate question. I will ask the Minister to supply you with a list.

SRI V VISWESWARARAO :—I want those names, Sir.

Mr. SPEAKER :—All right. I will ask the Government to supply you with a printed list.

*Nursing Committees in the State.*

227.
* 135 Q: SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the recommendations of the Nursing Commitiee; and

(b) the recommendations so far implemented ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) and (b) A statement* moving the recommendations made by the Nursing Committee and the section taken thereon is placed on the table of the House.

(a) and (b) Nursing Committee వారు చేసిన సిఫార్సులు, వాటిపైన ప్రభుత్వం తీసుకున్న చర్యలు, ఆ వివరాలన్నీ, సభవారి ఎదుట పెట్టబడినవి.

SRI S. VEMAYYA :—ఇందులో ఉన్న item No. 3, page (1) లోని ఆఖరు item లో ఏమి ఉన్నదంటే, "The Public Health Nurses or the Public Health Visitors, పదివేల మంది జనాభాకు ఒక్కొక్క Public Health

* Vide appendix I at page 52 infra.

Nurse, ఒక Public Health Visitor ఉండాలి'' అనే విధానాన్ని వారు అంగీకరించారు. ఆ references Director of Medical Services వద్ద ఉన్నవని అన్నారు. అయితే, అవి ఆయన వద్ద ఎంతకాలమునుంచి ఉన్నవి ? అవి ఎంత కాలములోగా తెప్పించి implement చేస్తారో చెబుతారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ సిఫార్సులు అంగీకరించాలంటే, అందుకు డబ్బుఖర్చు ఉన్నది. అసలు ఉన్నటువంటి అడ్డు అదే. Director of Medical Services అయినా, మరెవ్వరు అయినా, అంత ఖర్చు పెట్టటానికి మనకు ఉన్న బడ్జటులో వీలుఉంటుందా అనేది correspondence జరుగుతున్నది. ప్రభుత్వానికి డబ్బు పుష్కలంగా లభించినకొద్దీ, ఆ సిఫార్సులు అమలులోకి పెట్టుతూ ఉంటారు.

*Registrations at Employment Exchanges*

228.

*167 Q: SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of persons who registered their names at the Employment Exchanges in various places in Andhra State during each of the years 1954, 1955 and 1956 up to date; and

(b) the number of graduates and the number of Secondary School-Leaving Certificate holders out of them ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) 1954-65,860
1955-77,635
1956-33,696
(upto 31-5-56).

(b) *Graduates*
1954-2,129
1955-2,283
1956-1,152
(upto 31-5-56)

*S. S L. C. holders*
1954-11,646
1955-21,672
1956 (upto 31-5-56) 9158

24th September 1956]

(a) Employment Exchange Offices లో register అయిన సంఖ్యలు యివి :

| | | |
|---|---|---|
| 1954 వ సం॥లో | ... | 65,860 |
| 1955 ,, | ... | 77,685 |
| 1956 ,, | ... | 33,696 |

(b) *Graduates* :

| | | |
|---|---|---|
| 1954 వ సం॥లో | ... | 2,129 |
| 1955 ,, | ... | 2,283 |
| 1956 ,, | ... | 1,152 |

*S.S.L.C. Holders* :

| | | |
|---|---|---|
| 1954 వ సం॥లో | ... | 18,646 |
| 1955 ,, | ... | 21,672 |
| 1956 ,, | May నెల 31 వ తేదీ వరకు | 9,152 |

SRI V. VISWESWARA RAO :— మంత్రిగారు యిచ్చిన సంఖ్యలను బట్టి చూస్తే ఏ సంవత్సరానికి ఆ సంవత్సరము రాష్ట్రములో నిరుద్యోగులు జాస్తి అవుతున్నారని తెలుస్తున్నది. కాని యీ మధ్య యీ నిరుద్యోగ సమస్య తొలగించడానికి ప్రభుత్వం చర్య తీసుకుంటున్నది అని మంత్రిగారు అనేక సందర్భాలలో చెప్పుతునే ఉన్నారు. కాని యీ సంఖ్య మాత్రము జాస్తి అయిపోతూనే ఉన్నది. అందువల్ల యీ నిరుద్యోగుల సంఖ్య తగ్గించటానికి గట్టి చర్య ఏదైనా ప్రభుత్వం తీసుకుంటారా ?

THE HON. SRI G. LATCHANNA :—జనాభా ప్రతిపత్తిని బట్టి నిరుద్యోగుల సంఖ్య జాస్తి అయితే కావచ్చు. అంతే కాకుండా private sector కు సంబంధించినంతవరకు Employment Exchanges వారికి యిది obligatory యే. ఆ కారణము చేత వారు ఎక్కువమందికి నోటిఫై చేయరు. తరువాత temporary service అనేది ఎక్కడైతే జరుగుతూ ఉంటుందో, అక్కడే మనుష్యులు కూడా సిద్ధంగా ఉంటారు. కాబట్టి యిది Employment Exchanges వారి ద్వారా జరగదు. ఇక పోతే ప్రభుత్వ డిపార్టుమెంటులలో clerical posts అన్నీ Public Services Commission వారి ద్వారా recruitment జరుగుతున్నది. అందువల్ల వీరిలో ఎక్కువ మంది కాలేజీలనుంచి గాని, హైస్కూల్సునుంచి గాని వచ్చేవారి పేర్లు రిజిష్టరు అయిన సంఖ్య కొంతవరకు ఎక్కువగానే కనబడుతూ ఉంటుంది.

SRI S. VEMAYYA :— ఈ Employment Exchange Offices అన్నీ యిప్పటికి రాష్ట్ర ప్రభుత్వాలకు hand-over అయినట్లేనా ? అలాగైతే, వారిమీద ప్రభుత్వానికి అధికారము ఉంటుందా, లేదా ?

THE HON. SRI G. LATCHANNA :— మొన్న పోయిన ఒకటవ తేదీకి defacto transfer జరిగింది. రాబోయే ఒకటవ తేదీకి dejure transfer జరుగుతుంది. ఈ transfer జరిగేసందర్భములో Director of Employment Exchanges యిక్కడికి నిన్ననే వచ్చారు. ఈ సాయంత్రము ఒక Conference కూడ జరుగబోతున్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— మంత్రిగారు Employment Exchange Offices లో register అయిన సంఖ్యలను చెప్పారు. కాని వీరిలో ఎంతమందికి ఉద్యోగము లభ్యమయిందో చెబుతారా ?

THE HON. SRI G. LATCHANNA :— ప్రత్యేక ప్రశ్న వేస్తే, తప్పకుండా చెబుతాను.

*Complaints against the Weavers' Co-operative Society, Chimakurthy.*

229.

* 754 Q. SRI B. V. SIVAIAH :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state:

(a) whether the Government have received any complaints against the Weavers' Co-operative Society, Chimakurthy, Guntur district; and

(b) if so, the action taken thereon?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) Yes, Sir.

(b) The allegations in the petition were enquired into by the Co-operative Department and no action was considered necessary at Government level as the Deputy Registrar, Bapatla was taking necessary action in the matter. The petitioners were advised to contact him for further action in the matter.

SRI D. KONDAYYA CHOUDARY :—ఆ allegations ఏమిటో నెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—The Vice-President of the Chimakurti Weavers' Co-operative Society was having 11 looms from 1944 to 1954 and transferred 8 looms nominally in favour of his relations. The Vice-President got his nephew appointed as clerk in the Society. The President appointed his own brother as clerk, one B. Venkateswarlu who misappropriated Rs. 7000/- of the Society and was acquitted by the Court. No proper account is being maintained for empty gunnies and iron scraps. No account is maintained for the iron jars and empty tins in which the colours would be got.

తరువాత, పదిమంది సభ్యులను తొలగించారని ఈ విధముగా ఎన్నో allegations ఉన్నవి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Deputy Registrar గారు action తీసుకున్నట్లుగా మంత్రిగారు చెప్పారు. ఆ action ఏమిటో చెబుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది కాదు. Action తీసుకోమని ప్రభుత్వం చెప్పింది. Action తీసుకుంటున్నారు.

*Complaints from the Members of the Panchayat Board of Kalidindi.*

230.

* 147 Q. SRI V. VISWESWARA RAO :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) whether the Government received any complaints from the members of the Panchayat Board of Kalidindi, in Kaikalur taluk of Krishna district on 12th November 1955 against the President of that Panchayat Board;

(b) if so, the action taken thereon;

(c) whether it is a fact that the President accounted the taxes 5 months after they were actually collected; and

(d) if so, the action taken against him?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

(c) and (d) A petition alleging that the President collected taxes and accounted for them after a delay of five months has been received by the Inspector-General of Local Administration and the matter is under investigation by the Inspector-General.

SRI V. VISWESWARA RAO :—Inspector - General of Local Administration కు పిటిషను వచ్చింది. అది వారి దృష్టిలో ఉన్నదని మంత్రిగారు చెప్పారు. అయితే యీ పిటిషనువచ్చి ఎంతకాలము అయింది? పాత పంచాయితీలు పోయి, మరల ఎలెక్షన్సు జరిగి, క్రొత్తగా పంచాయితీలు ఏర్పడ్డవి. ఇంత వరకు యింకా ఆపిటిషను గురించి ఆలోచిస్తూనేఉన్నారా? ఎంత కాలము జరుగుతుంది యీ ఆలోచన?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— 12-11-1955 తేదీ గల పిటిషను ఆయనకు 18-11-1955 తేదీన చేరింది. దానిని జిల్లా పంచాయతీ ఆఫీసరుకు పంపడము అయింది. విచారణ జరుగుతున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—జిల్లా పంచాయితీ ఆఫీసరుకు పంపామని అంటే, ఆయనకు పంపి యిప్పటికి ఎంతకాలము అయింది? విచారణచేసి రిపోర్టు పంపటానికి యింకా ఎంతకాలము పట్టుతుంది? ఇంత ఆలస్యము కావటానికి కారణము ఏమిటి?

THE HON SRI A. B. NAGESWARA RAO :— నా వద్ద ప్రస్తుతము ఆ వివరాలు లేవు. ప్రత్యేక ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI V. VISWESWARA RAO :— 1955 వ సంవత్సరపు నవంబరు నెలలో ఆపిటిషను వచ్చిందన్నారు. ఇప్పుడు 1956 వ సంవత్సరము సెప్టెంబరు నెల అయిపోవస్తున్నది. ఈ దినము 24 వ తేది. అంటే యిప్పటికి సుమారు తొమ్మిది, పది మాసములయింది. అయితే ఈ పదిమాసములుగా యీ విచారణ జరుగుతున్నట్లేనా? ఈ విచారణ పూర్తి కావటానికి యింకా ఎంతకాలము పట్టుతుంది?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— పిటిషనులోని allegations serious గా ఉన్నకొద్దీ, ఎక్కువకాలము పట్టుతూఉంటుంది. Serious allegations, అంటే ఏదైనా mis-appropriation charges ఉంటేగాని, యింకా అలాంటివి serious allegations ఉంటే, అవి విచారించటానికి తప్పకుండా time తీసుకుంటుంది. ఆ allegations అన్నీ పూర్తిగా, సక్రమముగా విచారించి, రుజువు అయితే చర్య తీసుకోవాలంటే, investigation బాగా జరగవలసి ఉంటుంది, time కూడా బాగా తీసుకుంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—జిల్లా పంచాయితీ ఆఫీసరు విచారించి రిపోర్టు పంపించారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ఇంకా పంపించ లేదండి.

SRI P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, మంత్రిగారు చెప్పే జవాబులో, ఆపిటిషను యింకా పరిశీలనలో ఉన్నదని అన్నారు. అయితే మన రాష్ట్రము మారిపోయి, ఆంధ్రప్రదేశ్‌కు వెళ్ళిన తరువాత కూడ యీ పిటిషనును విచారిస్తూనేఉంటూరా ? ఇలాంటి పిటిషనులు యిప్పటికి ఎన్నో వచ్చినవి. ఆలోచనలో పెట్టి చూస్తూఉంటామని చెబుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— చూస్తూఉండడము కాదు. విచారిస్తూ ఉంటారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఈ పిటిషను వచ్చి యిప్పటికి 9 నెలలు దాటిపోయినను, Inspector-General of Local Administration కు దానిలోని allegations జిల్లా పంచాయితీ ఆఫీసరు విచారించి రిపోర్టు పంపినట్లు కనబడదు. దానిని జిల్లా పంచాయితీ ఆఫీసరు విచారించి ఎందువల్ల రిపోర్టు పంపలేదో, వారి సంజాయిషీని call for చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARARAO :— ఇప్పటికే reminders ఎన్నో పంపడము జరిగింది. వారి రిపోర్టు రాగానే, అదికూడ యీ సభ పూర్తి అయ్యేలోగా వస్తే, ఆ సంగతి సభవారికి తెలియచేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :— నేను అడిగేది reminders సంగతి కాదు. సంజాయిషీ సంగతి అడుగుతున్నాను. అంటే, Explanation from the District Panchayat Officer, as to why he delayed the matter for such a long time, call for చేశారా అని.

THE HON. SRI A. B. NAGESWARARAO :— Explanation అడగలేదు కాని, విచారణ మాత్రము చేసి త్వరలో రిపోర్టు పంపమని చెప్పాము. Inspector General వద్దనుంచి report రాగానే, దానిని ప్రభుత్వం పరిశీలన చేసి, action తీసుకుంటుంది.

SRI A. VENKATARAMA RAJU :— ఇది బహుశ 1955 లో పంచాయితీ బోర్డుమీద వచ్చిన పిటిషను గురించి అనుకుంటాను. అయితే, యిప్పుడు పంచాయితీలకు కొన్నింటికి ఎన్నికలు జరుగుతూన్నవి. ప్రభుత్వం తీసుకోబోయే చర్య కూడా అలాగే తీసుకుంటారా ? ఆ పంచాయితీబోర్డు యిప్పటికి రద్దు అయి ఉంటుందిగదా ! అలాంటప్పుడు ప్రభుత్వం తీసుకోబోయే చర్య ఏమిటి ?

[24th September 1956

THE HON. SRI A. B. NAGESWARA RAO :— డబ్బు ఏమైనా తినివేస్తే, అది ఆడిట్ డిపార్టుమెంటు surcharge చేసి, వసూలుచేస్తారు. దానికి routine procedure కూడ ఉన్నది. ఆ procedure ప్రకారము తినివేసిన డబ్బు అంతా వసూలుచేస్తారు. విడిచిపెట్టరు.

*Rise in the cost of production for Agriculturists.*

231.
* 37 Q.—SRI N. C. SESHADRI : Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether the Government are aware of the abnormal rise in the cost of production for Agriculturists who have taken to mechanized cutlivation, as a result of the recent legislation of this Government levying a surcharge on diesel oil; and

(b) if so whether this Government propose to give relief to those wtho are using diesel oil for oil engines and tractors ?

THE HON. SRI. K. OBULAREDDI :—

(a) There has been no abnormal rise in the cost of production in case of mechanised cultivation, as a result of the recent increase in the he rate of tax on sales of diesel oil.

(b) Does not arise.

SRI N. C. SESHADRI :— Diesel Oil ఉపయోగిస్తే surcharge చేసే సందర్భములో, యీ సభలో ఉన్న శాసనసభ్యులు చాలమంది యీ surcharge diesel oil use చేసే motor tractors మీద surcharge వేయాలా, లేకపోతే Agriculturists మీద surcharge వేయాలా, అనే ఆలోచనవల్ల, యీ agriculturists కు ఎట్లాగైనా కొంత relief యివ్వవలసియున్నదని సభ్యులు చెబుతున్నప్పుడు, the Minister for Co-operation and Commercial Taxes యీ విషయము తప్పకుండా ఆలోచిస్తారని అన్నారు. అందువల్ల యీ విషయము ఆలోచించి diesel oil తో motor tractors ఉపయోగించేవారి పైననే విధించి, agriculturists కు తగలకుండా చేయటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. OBULA REDDI :— Mechanised cultivation మీద వేస్తే, ప్రస్తుతపు ధరల దృష్ట్యా రైతుకు ఎలాంటి నష్టము కూడ ఉండదు. ఇంజనులు వగైరాలు ఉపయోగిస్తే ఎకరానికి రు. 2-18-0 లు, Tractor వగైరాలు వాటికి Diesel oil ఉపయోగిస్తే, ఆ హెచ్చించిన పన్నుమీద ఎకరానికి రు. 8-1-0 లు పడుతుంది. అందువల్ల రైతుకు ఏవిధముగానూ నష్టము ఉండదని ప్రభుత్వం ఆలోచించడము జరిగింది.

24th September 1956]

*Cost of living index of Eluru town*

232.
* 289 Q: SRI VAVILA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state whether the cost of living index of Eluru town is taken into consideration for calculating the dearness allowance in respect of the districts south of the Krishna, viz., Guntur, Nellore, Kurnool, Anantapur, Cuddaph and Chittoor?

THE HON. Dr. B. GOPALA REDDI :—No, Sir.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఆ areaలో తీసుకున్న Cost of Living Index ఈ ఊళ్లకు apply అవుతుందా? గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం, కడప లో జీతాలు Calculate చేసినపుడు ఈ Index ఎక్కడిది calculate చేస్తున్నారు.

THE HON. Dr. B. GOPALA REDDI :— జీతాలకూ, Dearness allowance కు ఈ Cost of Living Index కు ఏమీ సంబంధము లేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Labour Disputes ఏమైనా వస్తే వాటిని ఆధారము చేసుకొని ఆలోచిస్తారు. ఇదివరకు ఏలూరు, బళ్లారి, విశాఖపట్నంలో ఉండేదానినిబట్టి మన రాష్ట్రములో ఏర్పాటు చేస్తున్నారు.

THE HON. Dr. B. GOPALA REDDI :—Cost of Living Index ను బట్టి Dearness allowance regulate కావడము లేదు. అనాడు తిరుచునాపల్లి, కోయంబత్తూరు, విశాఖపట్నం, బళ్లారి వగైరా places లో Cost of Living Index తీసుకుంటూ ఉండేవారు. 1942 లో ఒక Dearness allowance fix చేసినారు. 1948లో దానిని revise చేసి whole మద్రాసు State కు apply చేసినారు. కేవలము ఒక తాలూకా, జిల్లాను గురించి కాదు. 1948 లో నిర్ణయించినది నేటి వరకూ అమలులో ఉన్నది. కాబట్టి Cost of Living Index క్రిందకు, మీదకు పోతూఉంటే Dearness allowance కూడా క్రిందకు, మీదకూ పోతూ ఉండదు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, మన రాష్ట్రములో వేల కొలదిని నియమించిన I. L. T. D. ఫ్యాక్టరీలో Cost of Living Index తీసుకొనే నాటికే Dearness allowance ఇస్తున్నారు. అయితే వారు Eluru Cost of Living Index ను తీసుకోకుండా ముందునుది తీసుకొని అక్కడఉన్న employees కు అన్యాయం చేస్తున్నారు. కాబట్టి మనఆంధ్రకు Eluru Cost of Living Index ను బట్టి Dearness allowance వర్తింపచేసేటట్లు చేస్తారా? మంత్రిగారు Cost of Living Index ను బట్టి allowance fix కావడములేదంటున్నారు గాని, I. L. T. D. వారు Cost of Living Index ను బట్టి dearness allowance revise చేస్తున్నారు.

THE HON. Dr. B. GOPALA REDDI :—గవర్నమెంటు ఆఫ్ ఇండియా, Labour Ministry, వారు చూసుకొనవలసినది. గవర్నమెంటుకు సంబంధించినంతవరకు Gazetted, Non-Gazetted Officers కు ఇచ్చే D. A. కు సంబంధము ఈ ప్రశ్నలో లేదని నేను చెబుతున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—దానిలో ఒక సమస్య ఉంది. Labour Tribunals awards లోను ఇంత rise ఉన్నదికదా అని proportionate గా ఇస్తున్నారు Dearness allowance. గవర్నమెంటు వేరే Dearness allowance ఇస్తున్నారు. రెండింటికి సంబంధము లేదంటే ఎలాగు ?

Mr. SPEAKER :—You come with a specific question.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—That by itself is a specific question.

Mr. SPEAKER :—You are asking about the dearness allowance given to Government servants. It cannot be such an omnibus question covering so many Departments. Let it be a specific question relating to a particular establishment.

SRI VAVILALA GOPALAKRISHNAYYA : —Ambiguity లేదు. అయినా explain చేస్తాను.

THE HON SRI G. LATCHANNA :— Labour కు సంబంధించిన Dearness allowance గురించి ప్రశ్న. Index కు సరిపోయినట్లుగా ఇవ్వమని labour union వారు ఏదైనా complaint చేస్తే అది Conciliation కు వేస్తాము. అది successful కాకపోతే adjudicate చేసి తరువాత Tribunal దగ్గర తీసుకుంటారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఇప్పుడు Cost o Living Index మీద ఆధారపడి I. L. T. D. వారు నిర్ణయము చేస్తున్నారు. ఒక కంపెనీని గురించి మాట్లాడడము అసలు రాష్ట్రములో Dearness allowance ఇచ్చినపుడు Cost of Living Index ను బట్టి అమలుపరచవలెను. It is taken into consideration for calculating Dearness allowance.

MR. SPEAKER :— Please do not bring in I. L. T. D. under Question No. 232. Let there be a specific question relating to I. L. T. D., so that the Government's attention may be brought to that question and give you the required information.

TAE HON SRI G. LATCHANNA :— General principle apply కాలేదు. అక్కడివారు complaint పెడితే ప్రభుత్వం చర్య తీసుకొంటుంది.

*Rising prices of food stuffs*

233.

*86 Q: SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

SRI S. VEMAYYA:—

SRI M. NAGI REDDI:—

Will the Hon. the Minister for Agriculture be pleased to state what action was taken by the Government to tide over the difficulties caused by the rising prices of foodstuffs, especially rice, sugar, chillies and edible oils, etc.?

THE HON. SRI K. OBULA REDDI:—The Government have ordered the opening of Fair Price shops at select centres wherever necessary, for supply of rice at cheap rates to the public.

No special measures are considered necessay to check the prices of other food stuffs like sugar, chillies and edible oils.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— Selected centres అంటే వాటికి ఆధారము ఏమిటి? రాష్ట్రవ్యాప్తముగా ఉన్నట్టు ఈ హెచ్చు ధరల బాధను నివారించడానికి కొన్ని చోట్ల fair price shops ఏర్పాటుచేస్తే సరిపోతుందని అంటున్నారు. దీనిపై అరగంట చర్చకు అనుమతి ఈయగోరుచున్నాను.

MR. SPEAKFR:—There is a request for half an hour debate. I am inclined to give the half hour debate. So let us proceed to the next question.

*Cost of living indices*

234.

* 409 Q: SRI VAVILALA GOPALAKRISNAYYA:—Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether the Government are aware of the rise in indices of cost of living in Andhra State;

(b) if so, what are the indices for the months in 1956;

(c) what are the reasons for rise in the cost of living particularly foodstuffs; and

(d) what are the measures Government have taken to stop the rise in the cost of living indices and inflation?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) Yes.

(b) The cost of living index numbers for Visakhapatnam and Eluru centres from January to July are as follows:

| | *Visakhapatnam* | *Eluru* |
|---|---|---|
| January 56 | 339 | 389 |
| February 56 | 343 | 407 |
| March 56 | 360 | 419 |
| April 56 | 363 | 426 |
| May 56 | 363 | 426 |
| June 56 | 369 | 429 |
| July 56 | 377 | 438 |

(c) The rise in the cost of living index is mainly due to the rise in the prices of rice, sugar, chillies and edible oils.

(d) The attention of the member is invited to the answer given by Minister for Agriculture to a similar question No. 86 (Starred).

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Similar Question కు వారు జవాబు చెప్పలేదు కనుక ఈ ప్రశ్న వచ్చింది. Inflation Question ఒకటి ఉంది. ప్రశ్నలో భాగము అది. అందువల్ల Inflation గురించి చర్చ కావలెను.

MR. SPEAKER:— That is a thing our government cannot control.

THE HON. SRI K. CHANDRAMOULI :— దానిని గురించి Fair price shops open చేస్తున్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— విశాఖపట్టణంలో 50 పాయింట్లు వరకు rise అయినది. ఇంత rise అయిన తరువాత అయినా ప్రభుత్వం అక్కడఉండే ప్రజల జీవిత అవసరముల విషయంలోను, వారి జీతాలు పెరిగినాయా అనే విషయంలోను ఆలోచన చేశారా? లేనట్లయితే ఆలోచించి తగుచర్య తీసుకుంటారా ?

THE HON SRI K. CHANDRAMOULI :— విశాఖపట్టణం అంటే విశాఖపట్టణం area అన్నమాట. ఎక్కడయినా abnormal situation ఉంటే fa.r price shops పెట్టి price తగ్గించడానికి ప్రయత్నం చేస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— 50 పాయింట్లు పెరిగింది అంటే అది abnormal situation అన్నమాటే. దీనిపై చర్య తీసుకోవాలనే అభిప్రాయం ఉన్నదా? లేదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— తీసుకోవాలనే ఆలోచన ఉన్నది. Of late ధరలు పడిపోతున్న సంగతి కూడా వెంకటేశ్వర్లుగారు గమనించాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— మంత్రిగారు ఈ అంకెలలో ధరలు పడిపోతున్నట్లు ఎక్కడా సూచించలేదు.

THE HON. SRI K. CHANDRAMOULI :—అంకెలు జూలై వరకు మాత్రమే అడిగారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Towns మాత్రమే కాకుండా చుట్టుప్రక్కల ప్రాంతం కూడా ఇందులో వస్తుంది అని అంటున్నారు. మాధవరం తీసుకుంటే జనవరిలో 396 వుంటే జూలైలో 463 వున్నది. దాదాపు 66 పాయింట్లు పైన rise అయినది. పల్లెటూళ్ళలో 60 పాయింట్లు పైన rise అయితే పరిస్థితులు ఎలా వుంటవో మనకు తెలుసు. దీనిని అరికట్టడానికి ఏమి చేస్తారు? అవిడివరం తీసుకుంటే జనవరిలో 374 వున్నది. జూలైలో 430 ఉన్నది. అదికూడా దాదాపు 60 పాయింట్లు rise అయినది. ఇవన్నీ గవర్నమెంటు figures; latest figures మనకు తెలియవు.

MR. SPEAKER :— SRI Gopalakrishnayya is making a speech. He may reserve it for the half hour debate.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఒక పాయింటు clarify చేయడానికి కొంచెం ఎక్కువ information ఇవ్వవలసి వస్తోంది.

THE HON. SRI K. VENKATA RAO :— మెంబరు information అడగాలి కాని information ఇవ్వకూడదు ; అది ఉపన్యాసము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ప్రశ్నను పూర్తి చేయడానికి information ఇస్తున్నాను. నేను వేసేది ప్రశ్న ; ఉపన్యాసం ఇవ్వడం లేదు.

MR SPEAKER :—What is the question you want to put ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— 70 పాయింట్లు వరకు rise అవుతుంటే ప్రభుత్వం ఏమి చర్య తీసుకుంటున్నదో చెప్పవలెనని కోరుతున్నాను.

[24th September 1956

MR. SPEAKER :—That is a separate question.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఇదివరకు ప్రశ్న fair price shops కు సంబంధించినది ; ఇది inflation కు సంబంధించినది.

SRI PILLALAMARRI VENKATESWARLU :— 60 పాయింట్లు వరకు ధరలు rise అయినాయి కాబట్టి dearness allowance పెంచడానికి ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—Prices పడి పోవడానికి ఆలోచిస్తున్నాము. జీతాలు హెచ్చించే ఆలోచన ఇందులో లేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— My question was not answerd, Sir

Mr. SPAEKER —The same question is repeated in different words. I will ask the Hon. Minister to answer the points in the debate.

SRI A. KALESWARA RAO :—ధాన్యాన్ని, బియ్యాన్ని ఇతర రాష్ట్రాలకు ఎగుమతి కాకుండా ఆంధ్ర రాష్ట్రం నుంచి బయటకు పోకుండా ఏమైనా తాత్కాలిక నిర్బంధాలు చేసి ధరలు తగ్గిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— ధరలు తగ్గించడానికి కొన్ని నియమములున్నాయి. First step గా fair price shops ఏర్పాటు చేస్తే కొంతవరకు ధరలు పడిపోతాయి. తరువాత ఇంకా ఏమైనా చర్యలు తీసుకోవాలంటే ఆలోచిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Fair price shops ఏర్పాటు చేయడానికి ప్రభుత్వందగ్గర ఏమాత్రం stocks ఉన్నాయి.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇండియా గవర్న మెంటుదగ్గర ఉండే stocks లో మనకు కావలసినవి ఇస్తారు.

*Development of special Minor Irrigation Projects.*

235.

* 183 Q.—SRI P. GUNNAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state the amount allotted for each district for the development of special Minor Irrigation Projects from the total amount provided in the State Budget for 1956-57 ?

THE HON. SRI. N. SANJEEVA REDDI :—

| *Name of the District* | *Amount allotted for 1956-57 in Rs.* |
|---|---|
| 1. Srikakulam | 7,56,500 |
| 2. Visakhapatnam | 14,700 |
| 3. East Godavari | 84,000 |
| 4. West Godavari | 3,12,500 |
| 5. Guntur | 50,000 |
| 6. Nellore | 2,18,300 |
| 7. Chittoor | 66,500 |
| Total: | 15,02,500 |

To avoid supplementaries I may also say this : కొన్ని జిల్లాలకు ఇందులో లేవు అంటే allotment లేదు అనుకోకండి. Sanction అయినవి అన్నీ కలిపితే 15 లక్షల వరకు ఉన్నాయి. ఈ సంవత్సరం ఖర్చు చేసేది మాత్రమే చెప్పాను. అందుచేత తాలూకాలవారీగా supplementaries వేయవద్దని కోరుతున్నాను.

SRI P. GUNNAYYA :— శ్రీకాకుళంజిల్లాలో 7 లక్షల రూపాయలు minor irrigation క్రింద ఇచ్చాము అని చెప్పారు. ఏ ఏ తాలూకాలలో ఏ ఏ స్కీముల క్రింద ఎంత ఇచ్చారో చెబుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— మొత్తం ఖర్చు చేసే దానిలో 50% వరకు శ్రీకాకుళంజిల్లాకు వచ్చినందుకు అభినందిస్తారనుకున్నాను. తాలూకాలవారీగా కూడా అడుగుతున్నారా ?

SRI PILLALAMARRI VENKATESWARLU :— 175 లక్షలు మనకు కేటాయించినపుడు 15 లక్షలు మాత్రమే ఖర్చు చేయడానికి కారణం ఏమిటి ?

THE HON. SRI N. SANJEEVAREDDI :— అప్పటికి ready గా ఉన్న స్కీములు t:ke up చేశాము, We can easily spend that amount. అందులో అనుమానం లేదు.

SRI S. VEMAYYA :— Allotment లో ఇప్పటికి unspent గా ఉన్నది ఎంత ? ఈ సంవత్సరంలోపుగా ఖర్చు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVAREDDI :— 15 లక్షలు అంత పెద్ద amount కాదు. శ్రీకాకుళం జిల్లాలో జమీందారీ చెరువులు ఎక్కువగా ఉన్నాయి. అందుచేత sub-divisions వేసి ఎక్కువగా ఖర్చు చేస్తున్నాము. అక్కడ breached tanks ఉంటే ఎక్కువగా ఖర్చు చేస్తున్నాము. ఈ మొత్తం అంతా ఖర్చు చేస్తాము. అనుమానం ఏమి లేదు,

*Polytechnic at Visakhapatnam.*

236.

*602 Q: SRI M. NAGI REDDI :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether the Government have decided to start a Polytechnic at Visakhapatnam?

(b) if so, what are the courses of study that will be provided in that Polytechnic?

(c) the expenditure that will be incurred therefor; and

(d) the share of the expenditure that will be borne by the Central Government?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes, Sir.

(b) The following subjects will be taught to start with:

(1) Civil Engineering

(2) Mechanical Engineering

(3) Electrical Engineering

(c) The estimated expenditure for running the Polytechnic is

*Non-Recurring Expenditure ;*

| | |
|---|---|
| Buildings: | Rs. 6,25,000 |
| Equipment including Library, Furniture etc. | 8,75,000 |
| Total. | 15,00,000 |

*Recurring Expenditure per annum*

| | |
|---|---|
| Staff | 1,20,000 |
| Maintenance | 40,000 |
| Total. | 1,60,000 |

(d) The Government of India have agreed to bear Rs. 5 lakhs out of Rs. 15 lakhs of non-recurring expenditure mentioned in item (c) above.

24th September 1956 ]

*Amendment of the rule 3 (1) (c) of the Madras Factories Rules.*

237.

* 518 Q. SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether there are any proposals pending with the Government since 1951 to amend the rule 3 (1) (c) of the Madras Factories Rules, with a view to make suitable provision for the submission of plans and information by the owner of and industry in accordance with the Town-Planning Rules as contemplated in the Administration Report of the Town-Planning Department for 1952-53 ; and

(b) if so, at what stage they now stand ?

THE HON. SRI G. LATCHANNA :—

1. No, Sir.

2. Does not arise.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Proposals ఆలోచన లో ఉన్నాయని, చేయబోచున్నాము అని owners support చేయడం లేదని రిపోర్టులో వ్రాసారు. ఇప్పుడు లేదంటే ఏమి అనుకోవాలో తెలియడం లేదు, 'లేదు' ఎమిటో చెప్పాలని కోరుతున్నాను.

Mr. SPEAKER:— If you have got a strong case for a change make out a case.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Annual రిపోర్టు లో factory onwers సహకారం సరిగా ఇవ్వడం లేదు; తీవ్రంగా ఆలోచించాలని వ్రాసారు. తరువాత ఏమి చేసారు అని అడిగితే 'no' అంటే అర్థం ఏమిటి ?

THE HON. SRI G LATCHANNA:—ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఈ ప్రశ్నమీద పరిశీలన జరిగి ప్రస్తుతం అవసరం లేదని drop చేయడం జరిగింది. రిపోర్టు వ్రాసిన ఏడాదిలోనే ఇది జరిగింది.

SRI S. VEMAYYA:— ఏ ప్రతిబంధకాలు ఆధారం చేసుకుని drop చేసారు ?

THE HON. SRI G. LATCHANNA :— 3 (1) (c) ఫ్యాక్టరీ అక్టు ప్రకారం ఏ ఫ్యాక్టరీ అయినా improve చేసినా నిర్మాణం చేసినా factory Inspector permission మాత్రమే కాకుండా factory buildings planning & development director వారి సర్టిఫికేటు పొందాలని 3 (1) (c) లో చెప్పబడి ఉన్నది. అందువల్ల further గా అవసరం లేదని ప్రభుత్వంవారు drop చేసారు.

[24th September 1956

*Amount spent under travelling allowances by Srikakulam District Board.*

238.

* 456 Q.— SRI P. NARASIMHAPPA RAO :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) what is the amount spent by Srikakulam District Board under travelling allowance from out of the expenditure during the years - 1954-55 and 1955-56.

(b) whether the monthly journeys of the Personal Assistant to the Special Officer, District Board, Srikakulam, justify the travelling allowances drawn;

(c) whether there are any audit objections of the travelling allowance bills and journeys; and

(d) if so whether they were certified and how?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The amount spent by Srikakulam District Board on Travelling Allowance from out of the expenditure during the years 1954-55 and 1955-56 was Rs. 34,421-15-9 and Rs. 33,532-3-0 respectively.

(b) The answer is in the affirmative.

(c) During the audit of the accounts for 1954-55, 16 objections involving an amount of Rs. 71-11-0 were raised. The audit of the accounts for 1955-56 has not yet been taken up by the Audit Department.

(d) The objections raised by the Audit Department have been communicated to the persons concerned for answering the objections. If the replies furnished by them are not found to be satisfactory by the Audit Department, the amounts objected to will be made good from the persons concerned.

SRI P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, ఇంతకు ముందు P A. లు ఇంత ఖర్చు పెట్టుతూ వచ్చారా? ఈ P. A. ను గురించి Chief Minister గారు exemption ఇచ్చి ఖర్చు పెట్టించారా అని అడుగుతున్నాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO :— Chief minister గారు ఈ P. A. కు exemption ఇవ్వలేదు. ఇక్కడ వివరాలున్నాయి. దీంట్లో management క్రింద

54-55 లో రు 8023-11-0

55-56 లో 3682- 0-0

Secondary education క్రింద

54-55 లో రు 6429-12-0

55-56 లో 7129-12-0

Public Health క్రింద

54-55 లో రు 16639- 7-9

55-56 లో 14332-15-0

Remunerative enterprises క్రింద :

54-55 లో రు 5474- 2-0

55-56 లో 5437-12-0

Elementary education క్రింద :

54-55 లో రు 2854-15-0

55-56 లో 2998- 3-0

SRI P. NARASIMHAPPA RAO:—54-55, 55-56 లో బోర్డులో వచ్చిన రాబడి ఎంతో మంత్రిగారు చెప్పుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—రాబడి లేదు. ఖర్చుమాత్రం ఉంది.

54-55 లో రు 29,91,482-2-4

55-56 లో 42,69,335-5-6

*Extension of the Rajolibunda Anicut*

239.

* 397 Q: SRI P. VENKATASUBBAYYA:—

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) whether the Government propose to extend the Rajolibunda Anicut across the Tungabhadra on the Andhra side; and

(b) if so, what extent of land in Kurnool district will be benefited by that extension?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) Yes. The Hyderabad Government have partially constructed an anicut at Rajolibunda from which water could be taken to Irrigate lands in the Hyderabad state. The question of their completing this anicut and agreeing to the Andhra State taking water from the anicut

for irrigation on the Andhra side, is under discussion. No agreement has yet been reached.

(b) The actual area that can be irrigated in Kurnool District will be known after detailed investigation is completed.

*Repair of the tank of Korrakodu.*

240, *285 Q SRI P. ANTHONY REDDI:— Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether the Collector of Anantapur has received any petition from the villagers of Korrakodu of Anantapur taluk for the repair of the tank; and

(b) if so, what action has been taken on it up to now?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) The answer was in the affirmative.

(b) The matter is under consideration in consulation with Public Works Department.

SRI S. VEMAYYA:— ఈ tank ఎప్పటినుంచి repair లేకుండా ఉన్నది? దానికి ఎంత estimate వేశారో తెలుసుకోవచ్చునా?

THE HON. SRI K. CHANDRAMOULI:— ఈ tank చాలా కాలంనుంచి పాడుపడి ఉన్నదండీ, ఇప్పుడు మళ్లీ బాగుచేస్తే కొంతవరకు సాగు క్రిందికి వస్తుందనేటటువంటి ఆలోచనకలిగింది. కాబట్టి మళ్లీ ఇపుడు investigation లో ఉన్నది.

SRI S. VEMAYYA:— దీని ఆయకట్టు ఎంత? రిపేరు చేస్తే ఎన్ని ఎకరాలు సాగు క్రిందికి రాబడుతుందో తెలుసుకోవచ్చునా?

THE HON. SRI K CHANDRAMOULI:— షుమారు 80 ఎకరాలు సాగు క్రిందికి వస్తుందేమో అని ఊహ.

*Admission of Andhra Students into the College of Indigenous Medicine, Madras.*

241. *507 Q: SRI P. VENKATASUBBAYYA:— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether the College of Indigenous Medicine, Madras, is admitting the candidates from Andhra since the formation of Andhra State; and

(b) if so, the number of such candidates studying for the award of diploma for G. C. I. M. & L. I. M. and the number studying for Compounder's Course?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The answer is in the affirmative.

(b) G. C. I. M. ... 107
Compounder's course ... 14

The L. I. M. Course has since been abolished.

(a) జవాబు అనుకూలం.

(b) G. C. I. M. 107, Compounder లు 14, L. I. M. ఇదివరకే రద్దు చేయబడింది.

SRI N. C. SESHADRI :— అధ్యక్షా, ఆయుర్వేద Practitioners ను regulate చేస్తూ ఇదివరకే ఒక బిల్లు pass చేశాము కాబట్టి మనవారు G.C.I.M. చదువుకొనుటకుగాను మద్రాసుకు పోకుండా మన ఆంధ్రరాష్ట్రంలోనే G.C.I.M. కోర్సును open చేయడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నం చేస్తుందా ?

THE HON SRI K. VENKATA RAO :— కొత్త ఆయుర్వేద బోర్డు తయారు అయిన తర్వాత, మనం అందరం విశాలాంధ్రకు వెళ్ళిన తర్వాత అక్కడ ఉన్నటువంటి మంత్రివర్గంవారు ఆలోచించి, అసలు G.C.I.M. కోర్సు పెట్టాలా, కొత్త పద్ధతిలో వారి సలహా ప్రకారం ఇంకొక రకంగా పెట్టాలా, అనే విషయం నిర్ణయం జరిగిన తర్వాత, ఈ విషయమై ఆలోచించబడుతుంది.

SRI A. KALESWARA RAO :— మద్రాసులో ఉన్న G. C. I. M. విద్యార్థులు, Indigenous, ఆయుర్వేద అంటే వాండ్లకు నామోషిగ ఉందట. Integrated medicine అని అనమన్నారట. అది నిజమేనా ? దానికి ఒప్పుకొనే, మన గవర్నమెంటు విద్యార్థులను పంపిస్తుందా ఏమి ?

THE HON SRI K. VENKATA RAO :—ఈ మధ్యనే దాని పేరు మార్చారండీ. Government school of integrated medicine అని పేరు పెట్టారు. Degree మాట దేవుడెరుగు. అసలు స్కూలు పేరే మార్చివేశారు. అందుచేత ఇది మనసులో పెట్టుకొని, క్రిందటి మాటు బిల్లు పెట్టినపుడు కూడ, చెప్పాను. మన పద్ధతి మనం అవలంబించుతాము అని.

SRI T. JIYYAR DAS :—అధ్యక్షా, ఉమ్మడి పొత్తులా ఉం , మన విద్యార్థులు వెళ్లి మద్రాసు రాష్ట్రంలో చదువుకొనడం, దీనికి ఏదైనా వాటా

ఏర్పాటు చేసుకొని G. C. I. M. ఇంత మంది విద్యార్థులు, compounders ఇంత మంది విద్యార్థులు అని మీరు నియమించు కొన్నారా ? దానికి ఏమైనా డబ్బు ప్రత్యేకిస్తున్నారా ?

THE HON. K. VENKATA RAO :—౩౩గ్గురిని ఏర్పాటు చేసుకొన్నామండి. ౩౩గ్గురు చొప్పున పంపిస్తున్నామండి. ఈ సంవత్సరం ౩౩ కూడా వచ్చారు. చాలామంది దరఖాస్తుదార్లు వచ్చారు. First class ల వారు వచ్చారు. Distinction వారు వచ్చారు. చాలా బాగానే జరుగుతుంది వ్యవహారం. అసలు Jiyyar Dass గారికి ఈ Integrated ఇష్టంలేదని అనుకొంటూను. వారి కెందుకు ఈ శ్రమ.

SRI P. SREERAMULU :— Indian Medicine College లో admissions కు ఆంధ్ర విద్యార్థులకు ఇంత సంఖ్య అని నిర్ణయం అయిందా ?

Mr. SPEAKER :—౩౩ అని చెప్పారండి. ౩౩ is our quota.

THE HON. SRI K. VENKATA RAO :—అసలు Indian medicine కాదండి, అద integrated medicine. మళ్లీ తప్పు ప్రశ్న వేస్తున్నారు. నేను ఏమి చేయను ?

*Extension of power-supply to Prodaturpet*

242.

* 681 Q : SRI S. RANGANATHA MUDALIAR :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Chief Engineer for Electricity has submitted a scheme for the extension of power-supply to Prodaturpet in Tiruttani aluk of Chittoor district : and

(*b*) if so, whether the Government will take early steps to sanction the scheme and execute the same during the current financial year ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) Yes.

(b) The question of sanctioning the scheme is still under consideration of the Government. Hence it is too early to say whether the seheme will be executed during the current financial year.

(a) అవునండి.

(b) ఈ స్కీము sanction చేయవలసిన అవసరాన్ని గురించి పరిశీలన చేస్తున్నది. అందుచేత ఇది ఈ ఏడాది అమలులోకి వస్తుందా, రాదా అనేది ఇపుడు చెప్పడం కష్టం.

24th September 1956 ]

SRI R. B. RAMAKRISHNA RAJU :— Sanction చేయడం అవసరమా, కాదా అని నా ప్రశ్న ?

THE HON. SRI G. LATCHANNA :— Scheme ప్రభుత్వానికి వచ్చిందా అంటే వచ్చింది అన్నాం. Scheme ను sanction చేశారా అంటే, చేయడంగురించి ఆలోచిస్తున్నాంఅని అన్నాము. Sanction చేయడం ఆలోచనలో ఉంటే, అమలు ఎప్పుడు అనేది చెప్పలేము అని మనవిచేశాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Chief Engineer proposal గవర్నమెంటు దగ్గరకు వచ్చి ఎన్నాళ్లు అయింది ?

THE HON. SRI G. LATCHANNA :— ఇందులో తేది సరిగాలేదు గాని అది వచ్చి అంతా రెండు మాసాలు అయి ఉండవచ్చును.

SRI S. RANGANATHA MUDALIAR :— Will the Hon. Minister be pleased to state what the objections are to the early sanction of the scheme?

THE HON. SRI G. LATCHANNA :—Sanction చేయము అంటే, ఏమి objection అనే ప్రశ్న వస్తుంది. Sanction చేసే సందర్భం గురించి ప్రభుత్వం విచారిస్తున్నది అన్నపుడు objection ఏమిటి అని అడిగే దానికి అవకాశం లేదు.

SRI S. RANGANATHA MUDALIAR :—Sir, Are there any difficulties with regard to sanctioning ?

THE HON. SRI G. LATCHANNA :—Sanction చేయడం గురించి ప్రభుత్వం పరిశీలుస్తున్నది అని మనవి చేస్తున్నాను.

*Minimum age to University courses*

243.

* 539 Q.—SRI M. NAGI REDDI :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the minimum age prescribed by the Government for admission to University courses; and

(b) what are the reasons for prescribing that limit ?

THE HON. Dr. B. GOPALA REDDI :

(a) No minimum age is prescribed for admission to arts Colleges. A minimum age of 17 years is now prescribed for admission to the following technical courses :

1. B. E. Degree Course.
2. M. B. B. S. do
3. B. V. Sc. do

(b) The primary object is to prevent immature boys from entering these arduous courses prematurely.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అయ్యా ఇది premature అని చెప్పి అనుకోవడానికి, కొందరు extra-ordinary students ఎక్కువ మార్కులతోటి చిన్న age లోనే pass కావటానికి అవకాశం ఉన్నప్పుడు, అది అరికట్టడం అవుతుంది. Restriction లేకుండా allow చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ఇది కేవలం ప్రభుత్వంవారు చేసింది కాదు. మద్రాసు ప్రభుత్వంలో మొదటినుంచి ఉంది. 14½ సంవత్సరములు వస్తేగాని Intermediate లో చేర్చవద్దని. అట్టిది Andhra University లో లేకుండా ఉండింది. అందువల్ల ఈ తగాదాలన్నీ వస్తున్నాయి. ఇటీవల ఈ విషయమై Inter-University Board లో, Education Ministers Conference లో చర్చలు జరిగినవి. వారు చేసినటువంటి శిఫారసుల ప్రకారంగా చేస్తునటువంటి reform. ఇది సరియైన కాలంలో, సరియైన క్లాసులో ఉండడం మంచిదేమో అనే ఉద్దేశంతో ఈ మాదిరి జరిగింది.

SRIMATI C. AMMANNA RAJA :— Medical course కు మొదలైన వాటికి 17 years ఉండవలెనని చెప్పారు. ఇది boys కు అని చెప్పారు, ఇది boys కే వర్తిస్తుంది అనుకొంటాను. Girls కు age limit లేదా ? అది కొంచెం సరిగా చెప్పండి.

THE HON. Dr. B. GOPALA REDDI :— Medical College విషయంలో ఇటీవల మేము చేసింది ఏమిలేదండి.

As regards Medical Colleges and Veterinary Colleges, the minimum age of 17 years is in force since a long time.

ఇక్కడ students అంటే boys and girls కే. కొత్తగా చేసింది ఏమిలేదు.

SRIMATI C. AMMANNA RAJA :— Girls కు చాలామట్టుకు పెండ్లి చేసుకొనే లోగా, course లు ముగించుకోవాలనే anxiety ఉంటుంది. ఆ consideration వల్ల age limit తగ్గించుతారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— Medical course అయిదు సంవత్సరాల కోర్సు. అయిదుపండ్ల కోర్సు పూర్తిచేసుకొని పెండ్లి చేసుకోవాలంటె, వాండ్లు, 12, 13 వ సంవత్సరంలోనే join అయి, 17, 18 సంవత్సరాలకు మెడికల్ కోర్సు పూర్తిచేసుకొని వివాహం చేసుకోవలసి వస్తుంది. అది అంగీకరించ డానికి, ప్రభుత్వంవారికి వీలుండదు.

SRI A. KALESWARA RAO :—Government వారు ఈమధ్య ఈ Pre-University course కు, దానినిబట్టి University course కు వచ్చే సంవత్సరం నుంచి, 57-58 నుంచి, 15, 16 సంవత్సరాలు నిండినవారినితప్ప చేర్చకూడదని విధించినట్లుగ ఒక G. .O కూడ తీసుకొనివచ్చి చూపించారు. అట్లా విధించడంవల్ల చాలామంది ఇదివరకే 13 ఏండ్లకు తయారై చాలా తెలివిగల కుర్రవాండ్లు high-schools లో ఉన్నారని, వాండ్లకు ఇబ్బంది వస్తుందని తల్లి దండ్రులు complaint చేస్తున్నారు కాబట్టి, మీరు అమలుపెట్టేది 1957-58 అనకుండా, ఇంకా రెండు మూడు ఏండ్లు అందరికి బాగా తెలిసి ఇకముందు అటువంటి పిల్లలను చేర్చుకొనకుండా ఉండడం మంచిదే. మీరుచేసింది ఆక్షేపించడం లేదు. Post-pone చేస్తే బాగాఉంటుంది. ముఖ్యమంత్రిగారు ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—Pre-University course, University corse కు సంబంధించి నంత వరకు మాకు ఏమి అధికారం లేదు. అది అంతా University వాండ్లు చేస్తున్నారు. University లో ఈ three year degree course చర్చ జరిగేటప్పుడు 17 సంవత్సరములు పూర్తి అయిన తర్వాత మాత్రమే University course కు రావాలని చెప్పి Inter-University బోర్డువారు, pass చేసుకోవడం, దానిని ఆంధ్ర, వెంకటేశ్వర University వాండ్లు ఒప్పుకోవడం, జరిగి దాని ప్రకారం చర్య అంతా చేస్తున్నారు. ఈ విషయంలో గవర్నమెంటుకు ఏమి సంబంధము లేదు. అంతా University కి సంబంధించిన విధానం. మనకు సంబంధించినది ఎంతవరకంటే, స్కూలు ఫైనల్ మాత్రం మనకు సంబంధించిన విషయం.

SRI T. JIYYAR DASS :—అధ్యక్షా ! ఇది University వారు చేసిన నియమం గనుక దీనిని చర్చించటానికి వీలుకాదేమోనని ముఖ్య మంత్రిగారు చెప్పుతున్నారు. వారు రెండు యూనివర్శిటీలకు Pro-chancellor గారు కూడాను. అయితే ఇది ఏదైనాకాని వయస్సుతో కూడినవిషయం. వయః పరిమితి, విద్యా సముపార్జన, బుద్ధి, మనస్సు చిత్తాలకు సంబంధించినది కదా ! ఈ వయః పరిమితి ఎందుకు అడ్డంవచ్చిందో ముఖ్య మంత్రిగారు సెలవిస్తారా ?

